శ్రీరస్తు.

# కొప్పులింగేశ్వరశతకము.

ఇది

గోదావరితీరంబున పల్వలపురంబునందుండు

కూచిమంచి సోమసుందరునిచే

రచియింపబడి

కప్పగంతుల సాంబశివరావుచే

ప్రకటింపబడియె.



రెండవకూర్పు 500 ప్రతులు

రామచంద్రపురం.

కృత్తివెంటి వేంకట కృష్ణారావు పంతులుగారి

విద్యావినోదినీముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

 వెల

శ్రీరస్తు.

# కొప్పులింగేశ్వరశతకము

ఇది

గోదావరీతీరంబున పల్వేలపురంబునందుండు

కూచిమంచి సోమసుందరునిచే

రచియింపంబడి

తత్పుత్రులు సాంబశివరావు[illegible]

ప్రకటింపఁబడియె.


రెండవకూర్పు 500 ప్ర[illegible]

రామచంద్రపురం,

కృత్తివెంటి వేంకట కృష్ణారావు పంతులుగారి
విద్యావినోదినీముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె



శ్రీరస్తు

శ్రీసదాశివపరబ్రహ్మణే నమః



# కొప్పులింగేశ్వరశతకము

శా॥ శ్రీనీహారవసుంధరాధరకుమారీసంగతార్ధాంగని
త్యానందామృతదానచంగకరుణాభ్యంచన్నిజాపాంగభ
క్తానీకప్రియసంగభవ్యశివయోగైశ్వర్యసింహాసనా
సీనాత్మాంబుజభృంగపల్వలపురీశ్రీకొప్పులింగేశ్వరా 1

మ॥ మరుకేళిన్మనువేశ్యకిచ్చినభవన్మాల్యంబె పూజారిచే
సరగన్ భూపతికివ్వనందొకశిరోజంబున్న చర్చింపఁగాఁ
బరఁగన్వాఁడదిస్వామిదేయనివచింపన్ వానిరక్షింపనీ
శిరమందప్పుడుకొప్పుదాల్చితటయోశ్రీ 2

మ॥ నతమందారనుతప్రచార నిగమాంతస్వైరసంచార భ
వ్యతరాకార విపద్విదార బుధలోకాధార దివ్యప్రభాం
కితకోటీరతమోవిదూర ఫణిరాట్కేయూర దుర్వారదు
ష్కృతసంహార సుధీర పల్వలపురీ శ్రీ . 3

మ॥ తపనీయాచలచాప సంయమిహృదంతర్గేహదీప భ
క్తపరాధీనదయాకలాప పరతత్వవ్యక్తనిక్షేప ని
త్యపరానందమయస్వరూప చితిభస్మాలేప నిర్లేప నీ
కృపనామీఁదనుజూపవేళయిదిరాశ్రీ 4

మ॥ నిఖిలాఘౌఘవినాశ లోకచయనిర్నిద్రస్వనిర్దేశష
ణ్ముఖముఖ్యాశ్రితసత్ప్రకాశ త్రిజగన్మోక్షాధిరాజ్యేశ చి
త్సుఖసంభావినిజప్రకాశ రజతక్షోణీధరాంచన్మహో
శిఖరోదారనివేశ పల్వలపురీశ్రీ 5

మ॥ జగదత్యంతబుధాభివాద్యభవరుగ్జాలాపహృద్వైద్యస
న్నిగమాంతప్రతిపాద్య సత్యఘనమానిన్యాంతసంవేద్య భూ
రిగుణాభిభవహృద్యసర్వసుమనోబృందాద్యనానామహ
ర్షిగణధ్యేయపదానవద్యచరితా శ్రీ 6

మ॥ అసమశ్రీసుకుమారమారహరణోద్యత్ఫాలదృక్సార సా
రసగర్భేష్టవిహార హారనిభకీర్త్యుత్కృష్టవిస్తార తా
గసమున్మద్గజవారవారణవపుఃక్రవ్యాదభీతామరా
ద్రిసముద్ధారవిచార చారణనుతా శ్రీ 7

మ॥ నతభక్తావనశీలనిత్యపరమానందామృతావాల సం
దితబృందారకజాల భూర్యుపనిషద్బృందాటవీఖేల సం
తతనిర్వ్యాజకరుణావిశాలత్రిజగద్రక్షాసమాలోల వి
స్తృతవిశ్వద్రుమమూల పల్వలపురీశ్రీ 8

మ॥ సకలామర్త్యగణప్రకాండ దివిషచ్ఛైలేంద్రకోదండ పా
తకసంఘాతవిఖండ మానిజనహృత్కంజాతమార్తాండ పూ
జకవర్గాభయదానశౌండ కరుణాసంరక్షితాజాండ హా
రికఖాంచద్గుణకాండ పల్వలపురీ శ్రీ 9

మ॥ అరమేనన్ జవరాలు పెన్ జెడలలోనవ్వేలుపుంజాలు వ
ల్వరహిన్ బెబ్బులితోలు చందమరునిసవ్వంజాలు మైదాలు చే
నరుదౌ ముమ్మొనవాలు వెండిమల చెల్వొప్పారు యుగ్రాలంగబల్
సిరిమీరన్ జగమేలు మేటిదొర నాశ్రీ 10

మ॥ సరిమాటిన్ నిగమాంతవాక్తతిబుధుల్ సర్వంపరంబ్రహ్మయం
చనుదారోక్తుల నిన్ బరాత్పరునిగా సువ్యక్తతం జెప్పుచున్
వినుతుల్ సేయుదురుగా దేసికునెపుర్వన్ విశ్వేశయింకెందుఁజూ
చిన నీకన్నను దైవతంబుగలదా శ్రీ 11

మ॥ కలవారల్ రసపాకసౌష్ఠవములంకారాళిఁ జెల్వొందనిం
తలుగాఁ బంధురగ సేయశక్తి కొలదిన్ దాఁ బేదయున్ జేయున
ట్లల బ్రిష్టోనులు మున్నెనర్చి నత్వదీయస్తోత్రముల్ పెక్కు భా
సిలుచుండన్నిను నేనుతించుటలు నో శ్రీ 12

మ॥ అవితర్క్యాఖిలమూల తావకవపుర్వ్యజ్ఞాంగ ధాత్రీరు
హోద్భవపద్మపరిభ వాండభాండఫలసంతత్యంతరాకీర్ణరం
ధ్రవిలోలన్మశకంబులా హరిహయబ్రహ్మాదులెన్నంగవా
రివిభూతుల్ భవదాశ్రితుల్ దలఁతురే శ్రీ 13

మ॥ తళుకున్ బంగరుమేల్ జరీజిగిబుటేదారీవలెన్నించువ
న్నెలఁ జెన్నొందు పులింతోలు శాలుగహోయల్ నిండార మైగప్పి య
న్నెలకూనన్ సిగఁబువ్వుగా నునిచి యెంతేనిన్ విన్నాప్పారు నీ
చెలువెన్నన్ వెయినోళ్లు చాలవపురారీ శ్రీ 14

మ॥ అమలప్రౌఢిమనశ్వలోకములమోహాభ్రాంతినొందించినం
తతముందిప్పెనునామహాప్రకృతియుద్యన్మోహసంసక్తి సం
యతమైయుండెనునీమకౌగిటనహాహారిపుభాశ్రీసమం
చితబాలేందుకలాకలాపరుచిరాశ్రీ 15

మ॥ త్రైలోక్యప్రకటాధిపత్యముసుధాంధస్స్వామికిన్ భూరినా
నాలోకైకవిభుత్వమచ్యుతునకు న్వాగ్భర్తకేతజ్జగ
ల్లీలాకల్పనశక్తి యిచ్చితివి బల్విఖ్యాతినీవంటిజే
జేలేలోకమునందునైనగలరా శ్రీ 16

శా॥ భాణుండెంతయుభక్తినిన్నువినుతింపన్మెచ్చివానింటసం
తానాసక్తినిగాపుకాచితటయేదైవంబులిబ్భంగిన
క్షీణోదారతభక్తవాంఛితములన్ జెల్లింతురీవిష్టప
శ్రేణిన్ జూచిననీవెకాకయితరుల్ శ్రీకొప్పులింగేశ్వరా 17

మ॥ మదముప్పొంగ గజాసురుండు సురలన్మర్దింపగావారునీ
పదమేదక్కువిరక్కమొక్కువేడ ననుకంపారూఢిచేవాడికిం
పొదవన్నీనభయంబొసంగి కరిదైత్యుందుంచిభవ్యస్థితిన్
దిదశానీకముగాచితీవటభళీ శ్రీ 18

మ॥ పశుసంఘంబులమమ్మునోపశుపతీ పాలింపవేయంచువి
ష్ణుశతానందముఖామరుల్ త్రిపురరక్షోభీతినివ్వేడనా
క్కాశరంబేసిపురాళిద్రుంచిజగముల్ గాపాడితౌరాభవా
దృశకారుణ్యవతాయణుల్ గలరెయోశ్రీ 19

మ॥ నరసింహాకృతిశౌరివిష్టపములన్గారింప భీతాత్ములై
సురలెల్లన్నినుఁజేరివేడఁగరుణాస్ఫూర్తి న్వెసన్నీవటన్
శరభాకారముఁబూనితద్భయదతేజంబెల్లఁజల్లార్చిచె
చ్చెరలోకంబులుగాచితీవకదమ న్శ్రీ 20

మ॥ అనురక్తిన్శివరాత్రివేళనొకకామాంధుండువేశ్యాంగనా
ఘనకేళీరతినుండియాచెలికుచాగ్రంబందునీకర్పితం
బనిపువ్వొక్కటొసంగమెచ్చితటయాహావిశ్వమందెన్నిచూ
చినలేరెందునునిట్టిభక్తసులభుల్ శ్రీ 21

మ॥ పరమాపాత్రికృతదివ్యమంగళభవద్భవ్యాంగసౌందర్యప
స్ఫురణంబాపురుషోత్తమాదులకుదా మోహావృతింజేయుచో
నరయంగానలదారుకావనమునీంద్రాజ్ఞానసల్ నిన్నుఁజూ
చిరుచిన్మోహనిమగ్నలౌటకరుదా శ్రీ 22

మ॥ వనజాక్షుండువరాహరూపధరుఁడై త్వద్దివ్యపాదాబ్జముల్
గనఁబాతాళముఁజొచ్చియందరసిడాఁగానంగలేకంతనీ
ఘనమహాత్మ్యమెఱుంగనేరికినశక్యంబౌనటంచున్నుతిం
చినలోకైకవిభుత్వమీవొసఁగితౌ శ్రీ . 23

మ॥ ఘనతన్నీపదసేవసేయునలమార్కండేయుసాధింపరాఁ
గనియాకాలునికాలఁదన్నితివివేకన్గుండెయల్ వీలిపా
యనితద్భీతినినాతఁడెవ్వమునునీయంఘ్రిస్తుతుల్ సేయువా
రినిదూరంబునఁగాంచిమ్రొక్కితొలఁగుశ్రీ 24

శా॥ స్వామీ కాముఁడు నీదుకంటఁబడి భస్మంబౌట చిత్రంబె నీ
నామం బొక్కటి యొక్కసారి యెవఁడైనన్ దా జపింపంగఁ ద
త్కామక్రోధవిలోభమోహమదమాత్సర్యాదికాంతస్థిత
స్థేమారాతిచయంబు భస్మమగుచో శ్రీ 25

మ॥ ధననాథుం డగు రాజరాజు సఖుఁడై తారాద్రిసంస్థానమై
ఘనలోకేశసుభృత్యుఁడై యలరమాకాంతుండు ముఖ్యాప్తుఁ
డై కనకాహార్యము చాపమై దగు జగత్కల్యాణునిన్ జేరి కొ
ల్చిన భక్తావళిభాగ్య మెన్నఁదరమా శ్రీ 26

శా॥ కాలోదగ్రమహాగ్రహోద్ధతికి మార్కండేయుఁ డాపన్నుఁడై
హాళిన్ నీశరణంబుఁ జొచ్చిన నుదీర్ఘాయుష్యసంపన్నుఁగా
లీలన్ జేసితి వింక నెందు నితరుల్ నీవంటి శశ్వత్కృపా
శీలుల్ లేరు జగత్త్రయిన్ వెదకినన్ శ్రీ 27

మ॥ సురలా హాలాహలానలోద్ధతశిఖాస్తోమార్భటిన్ స్రుక్కి నీ
శరణం బొందిన వారిపైఁ గరుణ మించన్ దద్విషం బానవో
నురుగర్భస్థితలోకముల్ చెడునటం చూహించి కంఠంబునన్
స్థిరతన్ సల్పిన బుద్ధి యాంబునిధివో శ్రీ 28

శా॥ దోషం బెన్నక నెత్తిఁ బెట్టుకొనవే దోషాకరుం బట్టి సం
తోషం బొప్పఁగ లింగధారియని యెందున్నీ ప్రభావంబు నా
భాషాధీశ్వరకైటభాంతకజగత్ప్రాణామరాచార్యవా
క్పోషాహీంద్రులకైన నెన్నఁదరమా శ్రీ 29

మ॥ శ్రుతిసందోహమునీప్రభావలవమున్ సూచింపఁగాలేక శా
శ్వేతవాక్యాసనసద్భక్తగోచరపరబ్రహ్మంబవీవంచునూ
గ్జిళ్ళయుక్తింగనిమాటమాటికిన మస్తేరుద్రయంచున్ నమ
స్కృతులెల్లప్పుడునీకొనర్చునుగదా శ్రీ 30

శా॥ నీవాత్సల్యనిరూఢికివ్విజయుఁడున్ నీపాదపద్మైకసం
సేవోత్కృష్టతకెన్నఁజక్రియుసురజ్యేష్ఠుండునీశక్తికిన్
నీవిద్యాప్రదరూఢికిన్ శ్రుతులునెంతేసాక్షులైయుండనిన్
సేవింపన్ గౌరవార్హమైనఁగలదా శ్రీ 31

శా॥ ధాత్రిన్ కొకబిల్వపత్రముసముద్యద్భక్తినర్పించినన్
సుత్రామాదులకందరానిపదవుల్ శోభిల్లగానిచ్చిన
నైష్ఠిక్రియావికిమోక్షమిచ్చెదటనీమాహాత్మ్యమేమందుబల్
చిత్రంబుల్ భవదీయదివ్యచరితల్ శ్రీ 32

మ॥ ఇతరుల్ దైవములెందరెందరిఁకవేఁడన్నంగనింద్యైననా
మతియేమోభవదన్యదైవతములన్ స్మరింపఁగాఁబూనద
ప్రిలిమాంచజ్జగదేకపావనహరిబ్రహ్మేంద్రముఖ్యామరా
ర్చితపాదాంబుజనిన్నుఁబాసియెఘుషున్ శ్రీ 33

మ॥ శతమన్యుండుభవత్ప్రిణామరుచిఁబూజానారమాచక్రవా
కృతినీస్తోత్రమహానుభావమునెఱుంగన్నేర్తురేగానిఖుం
కితరుల్ నేర్తురెనీగుణానుభవమెంతేసేయలీలావిని
ర్మితవంకేజభవాండభాండనికరా శ్రీ 34

మ॥ వసుధన్ బిల్వదళంబునీకునొక టర్పించైన సర్పింపనిం
ద్రాక్షాకల్పస్సన్నులై భవములీవిం జూతువో యంచు
సహస్రాక్ష చతుర్ముఖాదివిబుధుల్ దీప్తాని మేషైకదృ
ష్టిం బదాంచూచుచు వారలైరి మిషుల్ శ్రీ 35

మ॥ పొగడన్ నెంతయునంతరూప మహితుండైనన్ భవద్దివ్యస
చ్చరితల్ వర్ణనసేయఁజాలఁడఁట యస్మాదృగ్జడశ్రేణికిన్
దరమా నిన్బొగడంగ నింతయు యిఁక న్నాజ్ఞాన సాతిత్రసు
స్థిరకళ్యాణగుణాభిరామచరితా శ్రీ 36

మ॥ నిజ గేహోగతినేవ రుండమరనిన్ సేవించు నాతం డెపా
విజయుం డెందును నేతి దగ్ధమున కున్వై యైలనా సన్నసా
చిజ. శ్రేణికి నాకిఁ యింక నొరుల్ జర్చింపఁగా నేల యో
త్రిజగద్వంద్యపదారవిందయుగళా శ్రీ 37

శా॥ సాక్షాన్మోక్షఫలప్రదాత వ్రమహేశానుండవైనట్టిని
న్నాక్షేపించిన నెంత దక్షుఁడయిన న్హానిన్వసంబొందు ప్ర
త్యక్షంబేకద యిన్ని దక్షుఁడు ముత్వదీయావజ్ఞ గావించితా
శిక్షం జెందుట సర్వలోకమునకున్ శ్రీ 38

మ॥ సతి యూనీసతి యేసుమారుఁడును నెంచన్నీ కుమారుండె యు
న్నది వాగంబరముల్ దిగంబర మెనా నాలోకసర్గాదివి
స్ఫురలెల్లన్ భవదీయలీల లెకమున్ మూఢంబులై సార్థక
స్థితినొప్పారు నుగాకయొంటుటగు నా శ్రీ 39

శా॥ స్వామీ నీనిజభక్తకోటికి మహైశ్వర్యంబు లెల్లిచ్చియో
నీమైఁ జూడ దిగంబరుండవిక నెంతే గోచియున్ లేదని
నామస్థ్యంబవమొట్టదో శ్రితులకున్ సర్వస్వమిత్తో శ్రితిని
నీమోదారతఁ జెప్పుదండురు బుధుల్ శ్రీ 40

మ॥ ఒకటౌ బిల్వదళంబు పత్రిశతమ్ములై యొండొక్క పుష్పంబొ బా
యక పూజాబ్జములసంఖ్యలై యొకఫలంబా శ్రేష్ఠనానాఫల
పరికరంబై యొకయింత తోయమెలమిన్ బల్తోయమై సన్నవా
సికి నిత్యమ్ము సుభక్తి నీకొసఁగిన న్ శ్రీ 41

శా॥ నీభార్యామణి సర్వమంగళ భవన్మిత్రుండు దా శ్రీదుఁడున్
నీభవ్యాశ్వము భద్రమున్ దలఁప నెంతే నీ స్వధర్మంబు లో
కాభీష్టార్థము లెల్లనిచ్చు వరకళ్యాణస్వరూపంబిఁకే
రీభాగోన్నతి సన్న నీసరి దొరల్ శ్రీకొప్పలిం 42

మ॥ క్షితికన్యాపతియంతవాఁడు నినున్ సేవించియే కానితా
శతసంఖ్యామితయోజనాబ్ధిగడవన్ శక్తుండు గాఁడయ్యె నిం
కితరుశ్శక్తులె నిన్ భజింపక యపారేచ్ఛాంతరంగాని వా
రితసంసారపయోధి దాటుటకునో శ్రీ 43

శా॥ నీకై మ్రొక్కులొనర్చునట్టిశిరమెంతే యుత్తమాంగాఖ్యకా
నీకీర్తిస్తుతిసేయు జిహ్వయును వర్ణింపన్ రసజ్ఞాఖ్యకా
నీకళ్యాణకథాప్తి నుంచు చెవులున్ నిక్కంబు శ్రోత్రాఖ్యకా
శ్రీకంఠా యటుగాని వెల్లదగునా శ్రీ 44

మ॥ తనియవ్వాహనమై మృదంగధరుఁడై తాఁ బాణమై నేస్తుఁడై
తన రారన్ బ్రియభార్యయై మఱఁదియై త్వత్పూజకుండై సదా
నిను సేవింపుచు నేకదృష్టి మిగులన్ నిన్ జేర్చి నిన్నర్థిఁ గొ
ల్చిన వైకుంఠుఁడె పూజ్యుఁడీ జగములన్ శ్రీ 45

మ॥ భవదీయాంఘ్రిసరోరుహద్వితయసేవాధుర్యుఁడై నట్టిసా
రవి శేషజ్ఞునిపాదపంకజరజఃప్రవ్యాప్తిచేఁ బూతమౌ
భువిలోనంజరియించుకీటచయము న్మోక్షాప్తి నుండంగనో
శివ నీభక్తులు ముక్తులౌటకరుదా శ్రీ 46

మ॥ అకటా నీవు వరంబులిచ్చుతరి నింతైనన్ విచారింపవిం
చుకపుణ్యాత్ముఁడు వీఁడు వీఁడు ఖలుఁడంచున్ వారలెల్లన్ వని
న్నొకమార్గ భజించి వేడిననునీవుద్యత్కృపన్ వారికో
రికలీడేర్పుట నీస్వభావముగదా శ్రీ 47

మ॥ శివ నీవేకద విశ్వమంతయును జర్చింపంగ వెయ్యేలనీ
భువియున్దోయములగ్ని వాయువు నభంబున్ సూర్యచంద్రా
త్మలుఁ భవదీయాకృతులై చెలంగ మహిమన్ భాసిల్లునా
యష్టమూర్తి వినీకన్యములేశమైనఁ గలదా శ్రీ 48

మ॥ అలదుర్వాసుని గొప్పసేయక సహస్రాక్షుండు త్రైలోక్యని
స్తులసామ్రాజ్యరమావిభూతిఁ బోలఁగెందూర్ణంబెగానన్ ధరా
స్థలి నెవ్వాఁడు త్వదీయభక్తులఁ దిరస్కారంబుగాఁ జూచి భా
సిలఁజాలుఁ సిరిపోక జీవితముతో శ్రీ 49

శా॥ శుంభత్ప్రక్రియరాఘవాదులకునెవ్వోచ్చెదాటఁదానట్టియా
య్యంభోధిన్ దగనొక్కగుక్కఁగొనెనాహాకుంభజన్ముండుని
ర్దంభప్రౌఢిమలీలమీఱఁగభవద్భక్తిప్రభావంబుల
ర్ధంభాషాపతికైననెన్నవశమా శ్రీ 50

మ॥ హరినేత్రాబ్జముతోడనీకొగిసహస్రాబ్జంబులర్పించితా
సరగన్నీకుసుదర్శనంబుగొనుటాశ్చర్యంబెనాధ్యేలహృ
త్సరసీజంబొకటుత్వదర్పితమునొందఁజేయువాఁడెల్లఁజె
చ్చెరనీదివ్యసుదర్శనంబుగనుచో శ్రీ 51

శా॥ రంగొన్మేలితసంపుహమ్మలుమణీరాజత్ఫణాంచత్ఫణుల్
రంగన్మౌళితలస్రజంబుసుమనోరమ్యాపగారత్నమెం
చంగానంగవిలేపనంబతనుభాస్వద్భూతిమైమెప్పనీ
శృంగారంబుమహాద్భుతంబుగదరా శ్రీ 52

మ॥ చిరకాలంబుభజింపకున్నవరముల్చేకూర్పరేవేల్పులున్
గరిమన్నీకొకసారిమ్రొక్కిననుదత్కాలంబునందేసిరుల్
దొరయన్గోరికలెల్లనిత్తువఁటయెందున్లేరయుష్మాదృశా
చిరసంబాధదయాప్రసన్నహృదయుల్ శ్రీకొప్పలింగేశ్వరా

మ॥ భవదారాధనకున్ఫలంబనుచునాబ్రహ్మేంద్రలోకాదివై
భవముల్నీవొగినిచ్చెదేమొయవినీపాదార్చకుల్మెత్తురే
శివనీశాశ్వతయోగసౌఖ్యజలరాశిన్బిందువుల్చాఁడవా
రివిభుత్వంబుల, వేలమాకుననుచున్ శ్రీ 54

మ॥ అమరంగానొకసారెతజ్జపముసేయన్బ్రహ్మహత్యాదిఘో
రమహాఘంబులువీఁగిపారుసకలార్థశ్రీనిచేకూరును
త్తమనిర్వాణముఁజేరునంగయుభవత్పంచాక్షరీమంత్రభూ
రిమహత్త్వంబుగణింపబ్రహ్మతరమా శ్రీ 55

శా॥ కామక్రోధముఖాంతరంగరిపులన్ఖండించు,నుద్యన్మహో
ద్దామాపత్తమముల్హరించుఁబరతత్త్వప్రభవాంచత్పరం
ధామావాప్తిఘటించు,నెంతయుభవన్నామమ్ముసర్వోన్నత
క్షేమస్థానమశేషలోకములకున్ శ్రీ 56

శా॥ పాపారణ్యదవానలంబ,ఖిలసంపద్వల్లికాచైత్రము,
గ్రాపత్పర్వతవజ్రమిష్టఫలకల్పాగంబు,సంసారసం
తాపచ్ఛేదసుధారసంబు,నిగమాంతాత్మనిధానంబునీ
శ్రీపాదాంబుజభక్తికన్నఁగలదా శ్రీ 57

శా॥ ముద్రాభ్యాసనిరూఢినొందిమునిరాణ్ముఖ్యుల్సమాధిస్థితిన్
భద్రస్ఫూర్తితదేకలక్ష్యపరతన్భావింపనుద్భూతమై
హృద్రాజీవసుకర్ణికాంతరమునందింపారుతేజంబునీ
చిద్రూపంబనిచెప్పుచుందురుబుధుల్ శ్రీ 58

శా॥ జారుండైననుచోరుఁడైననుదురాచారుండునైనన్మహా
క్రూరుండైననుభక్తినొక్కపరినీకున్మ్రొక్కినన్వారలా
సారోదారకృపాకటాక్షశుభవీక్షారూఢినీదగ్గఱన్
జేరందీసివరంబులిచ్చెదుగదా శ్రీ 59

మ॥ ప్రకటింపన్ భవదగ్రసూనుఁడఖిలప్రత్యూహముల్ వాపుఁ బా
యక నీ గేహిని సర్వమంగళ సుభవ్యప్రాప్తిఁ గావించుఁ దా
పక నామంబు ఘటించుఁ దా శివపదవ్యక్తిన్, నినుం గొల్చువా
రికి సర్వార్థములాత్మహస్తగతముల్ శ్రీకొప్పలింగేశ్వరా 60

శా॥ గేయం బెంతయు వాక్ప్రపంచమున లక్ష్మింపంగ నీకీర్తి యే
ధ్యేయం బెన్నన శేషలోకములకున్ దేవేశ నీమూర్తియు
జ్ఞేయం బారయ నీదుతత్వమొకటే, చింతింప సర్వాధిక
శ్రేయం బీశ్వర నీపదార్చనమె కా శ్రీ 61

శా॥ రుద్రారాధకులన్న తావులకు మీరున్ నేనుఁ బోఁ గూడదా
రుద్రాక్షాప్తియు భస్మధారణము గుర్తుల్ వారికంచుం గడున్
భద్రింబొప్పఁగ నాత్మకింకరులకున్ బల్మాఱు కాలుండు ని
ర్ణిద్రప్రక్రియ నాజ్ఞ సేయునట యో శ్రీ 62

శా॥ ఆయుర్దాయమునందు బాల్యమున నస్వాధీన దేహేంద్రియ
వ్యాయామశ్రమ, యౌవనంబున దురంతాత్యంత కామార్తి రో
గాయాసవ్యథ వృద్ధభావమున, నాహా యూహ సేయంగఁ జీ
చీ యీ పుట్టున సౌఖ్యమింతగలదా శ్రీ 63

మ॥ క్షితి నానావిధహీనయోనులను గాసిన్ బుట్టుచుం జచ్చుచు
న్వెతలం బొందెడు ప్రాణిలోకమునకున్నీ పాదపద్మైకసం
స్మృతిదక్కన్మతియొండుత్రోవవలనన్ లక్షింపనీ ఘోరసం
సృతివారాశి, దరింప శక్యమగునా శ్రీ 64

శా॥ నీపాదాంబుజభక్తి లేకమిగులన్ నిత్యంబు నీచోన్నదర
వ్యాపారంబులఁ బ్రొద్దుఁబుచ్చుచు దురాశాయత్తులై యూరకే
తాపంబొందుచునున్న మాత్రముననే తర్కింపనా మోక్షని
క్షేపంబబ్బునె పుణ్యహీనులకునో శ్రీ 65

మ॥ జనసంఘంబున కెల్లెడన్ సులభనిష్పన్నంబులై తుమ్మిపూ
లును దోయంబును భూతిబిల్వదళములున్ జూడంగ నీప్రీతికిన్
స్వనివాసంబులుగా ధరిత్రి నమరన్ సర్వార్థదంబై తన
ర్చిన నీపూజయొనర్ప లేరకుమతుల్ శ్రీ 66

మ॥ కనకంబే క్రియ తారుమారయినఁ దద్గ్యార్థమున్ గుందుఁ జెం
దని భంగిన్ బరమేశ నీమహిమప్రబోధంబింతయున్ లేకనై
న నసూయామతినైనఁ బాపగతినైనన్ వ్యత్యయస్ఫూర్తి గాం
చినఁ దద్దోషియొకింతయున్ దరగునా శ్రీ 67

శా॥ నీవేదాంతసుచర్చనొక్క తత్త్రయున్ నీచింతనొక్కప్పుడున్
నీవిజ్ఞాననిరూఢినొక్కడుగు నన్నీపూజనొక్కజ్ఞనన్
గా విశ్వంభరఁ బ్రొద్దులిట్లనుపుచున్ వర్తించువారే కదా
జీవన్ముక్తులనంగ నొప్పు సుకృతుల్ శ్రీ 68

శా॥ యుక్తాచార్యనియుక్తపద్ధతి భవద్యోగక్రమాభ్యాససమా
సక్తిన్ జేయక సాధుభక్తజనతాసాంగత్యమున్ గానకే
భక్తిజ్ఞానవిరక్తిమార్గములనిన్ భావింపలేకూరకే
రిక్తాచారములందు ముక్తి గలదా శ్రీ 69

శా॥ ఒప్పన్నీపదభక్తి లేకతమచేనున్నంతలోఁగొంచెమో
గొప్పేపేదలకియ్యనొల్లకకుయుక్తుల్ నేర్చివేదాంతముం
జొప్పేకానకసర్వముందెలియునంచున్ శుష్కవేదాంతముల్
చెప్పన్మోక్షముగల్గునాజనులకున్ శ్రీ 70

శా॥ గానంబేకదపెద్దయెల్లకళలన్ గారీశలోకంబులన్
దానంబేకదమేటిసద్గుణములన్ దర్శింపనీసత్పద
ధ్యానంబేకదలెస్ససర్వపురుషార్థశ్రేణిలోఁజూడల
క్ష్మీనాథార్చితపాదపంకజయుగా శ్రీ 71

శా॥ కాయక్లేశములన్సహించిమిగులన్ గాసిల్లిమాయావిధో
పాయవ్యాప్తులఁబొట్టకంచుసిరిగూర్పన్ జూతురేకానియ
య్యోయీదేహమునమ్మరాదనుచుఁదానూహించినీధ్యానమున్
జేయంజాలరిదేమిసామిమనుజుల్ శ్రీ 72

మ॥ ఘనతర్కబ్రహ్మశిరంబుఁద్రుంచితదియుక్తంబేకదాగాథలు
బ్ధునివిత్తాధిపుఁగాఁగఁదాతనుదరిద్రుంగాఁగనత్యంతరి
క్తునసేకాత్మజయుక్తుఁగాఁగనపత్యుంగాఁగసంపన్నుఁజే
సినయాబ్రహ్మకునట్లకావలెసుమీ శ్రీ 73

మ॥ ధనమున్నప్పుడెదానధర్మములచేతల్ దల్లిదండ్రుల్ క్షితి
నత్రునాఁడేతదభీష్టసంఘటన, సమ్యక్పాటవంబైనయా
వనమందేవరతీర్థయాత్రలు, నరత్వంబందెనీపూజఁజే
సినవాఁడేకదజాణయెందునరయన్ శ్రీ 74

మ॥ ధరసాఫల్యముగాంచువర్షములచేతన్విద్యసాఫల్యమున్
బొరయున్ పదివ్వనయంబుచేఁగనుతపంబున్ శాంతిసాఫల్యమున్
వరసుజ్ఞానముచేత మర్త్యజనిసాఫల్యంబుదాఁబొందుబల్
సిరిసాఫల్యమునొందుదానగరిమన్ శ్రీ 75

మ॥ పరులన్ దప్పులుపట్టినంతటనె తాఁబ్రాజ్ఞుండుగాఁబోఁడు ద
బ్బరవేసంబులుదాల్చినంతటనె సద్భక్తుండుగాఁబోఁడు వా
విరిదుర్యుక్తులునేర్చినంతటనె తావిజ్ఞానిగాఁబోఁడును
స్థిరమౌనాత్మనిరూఢిలేక జగతిన్ శ్రీ 76

మ॥ ధనమే దైవములుబ్బుకోటికి, నితాంత స్వైరిణీసంగచిం
తనమే మోక్షము కాముకావళికి, నుద్యత్సాధుబాధాసమా
ర్జనమే ధర్మము దుష్టసంతతికి నైప్రస్ఫూర్తి నుండంగమిం
చిన సద్బోధలిఁకేల వారలకిలన్ శ్రీ 77

మ॥ జననీముఖ్యులఁదిట్టకున్న బహుపూజల్ చేసిన ట్లిద్ధస
జ్జనులన్ బాధలుసేయకున్న మిగులన్ సత్కారముల్ చేసిన
ట్లునిషిద్ధక్రియలేవగించిననుబల్పుణ్యవ్రతశ్రేణిఁ జే
సిన యట్లున్నఁగవచ్చునీ చెనుకలన్ శ్రీ 78

మ॥ పుడమిన్ గోడలికష్టమతయుఁగరంబున్నామ దైనట్టిలే
వడియల్లుండుఁగ్రియార్థి దన్యముదొరల్ ప్రాణివ్యథన్ గాలుఁడున్
గమజాలిన్ మృగబాధ వ్యాధుఁడును లెక్కం జేయరింతైననా
చెమగుందాతయి చేలచేసె జగతిన్ శ్రీ 79

మ॥ మతినెన్నన్ మహిలోన మానవులకున్ మర్యాదభంగంబు న
న్నృతియున్ నిందయు నీచయాచ్ఞ యపకీర్తి ప్రాప్తియున్ మానహీ
నతదైన్యంబును నొక్కచందములె యైనన్ హానిలోఁ జూడఁగా
మృతియొక్కించుక మేలు మాననిధికిన్ శ్రీ 80

మ॥ పరులన్ మోసము సేయనేర్పునతఁడే ప్రజ్ఞాధికుండెంతయున్
గరుణాశూన్యుఁడె గట్టివాఁడు కృతసత్కార్యుండె వేదాంతిని
ర్భరదంభాన్వితుఁడే ప్రపూజ్యుఁడును గాఁ బాటిల్లె నివ్వేళ న
చ్చెరువౌరా కలికాలపున్మహిమమో శ్రీ 81

మ॥ ఇలలో సంకరజాతివృద్ధియగుఁ గీడింతేనియున్ లేక, వి
చ్చలుఁ బెంపౌ విషకంటకాగములు వర్షంబింత లేకున్న నే
పలరున్ సేర్వకయున్నఁ జౌర్యముఖకృత్యంబుల్, స్వతస్సిద్ధమై
చెలఁగున్ దుర్గుణకోటి మానవులకున్ శ్రీ 82

మ॥ పతితుల్లేరు మదన్యులెందును, గణింపన్ లేరు నీకన్నఁ ద
త్పతితత్రాణధురీణులట్లగుట నొప్పన్ నీదు దాసుండనై
నతిగావించుట నాదువంతు దయ నన్రక్షింప నీవంతు సం
సృతిదూరా పరమేశ్వరా శుభకరా శ్రీ 83

మ॥ నెపమెన్నన్ దగఁదంటినిక్కముగ నేనీవాఁడనమ్మంటి నే
నపరాధిన్ ననుఁ బ్రోవుమంటిఁ బరులన్ బ్రార్థింపలేనంటి నీ
కృపఁ జూపన్ దరియిప్పుడంటిఁ గడునిన్ గీర్తింపుచుంటిన్ సరి
న్నపరాధ్యాపణనీదుచిత్తమిటుపై శ్రీ 84

మ॥ నియతిన్ జెప్పెద రూఢిగాఁగ విను మానేఁ జేయకున్నట్టి దు
ష్క్రియ యొక్కింతయు లేదు గాని యటులైనన్ నీపదాంభోరుహ
ద్వయి దిక్కంచును నమ్మినాఁడ మఱి నీదాసుం డనన్నిప్పుడే
క్రియ రక్షింతువొ నీదు చిత్తము సుమీ శ్రీ 85

మ॥ సవిశేషవ్రతదాన ధర్మనియమస్నానాది పుణ్యక్రియ
ల్లవముం జేయఁగ లేదు పోనియొక వేళన్ స్వప్నమం దైన నే
నెవరి న్వేల్పులఁ గొల్వ లే దెపుడు నిం కేలా బహూక్తుల్ సదా
శివ నీ వే గతి యంచు నమ్మితి సుమీ శ్రీ 86

శా॥ చిత్తైకాగ్రతఁ జేసి నీదు పదముం జింతింపఁగా నేరస
ద్వృత్తిం బొప్పఁగ దానధర్మగతు లర్థిన్ జేయఁగా నేర దు
ర్మత్తుండం ఖలుఁడన్ జడుండఁ గడు దుర్మార్గుండ దీనుండ నీ
చిత్తం బే క్రియఁ బ్రోతువో ననుఁ దయన్ శ్రీ 87

మ॥ అతిఘోరాఘము లెల్లఁ జేసియును లక్ష్యం బింతయు న్నేకస
న్మతి నే వేల్పులఁ గొల్వ లే దెపుడు గానన్ నా పయిన్ గోపసం
యుతులై యుండిరి వేళగా చిహరిముఖ్యుల్ గావునన్ నీపదా
శ్రితు నన్నిప్పు డుపేక్ష సేయఁ దగునా శ్రీ 88

శా॥ నీవే దిక్కని నమ్మినాఁడ పరులన్నే వేఁడ నీవాఁడ నా
కీవే దైవము తోడు నీడ మఱి నీవే సర్వముం జూడ నే
లా వేయున్నదు గన్నవాఁడ నిను నేలాగైన నే వీడ నీ
సేవాసక్తుఁడ నెట్లు బ్రోచెదొ ననున్ శ్రీ 89

మ॥ మునునీ కెంతటిపాపియైన నుగరంబుల్ మ్రొక్కి ప్రార్థించినం
తనెనీవా తనికిన్వరంబులిడి మోదంబొప్పరక్షించినా
వనిభాషింతురుకల్లలో నిజములో యీసుద్దులేనెంత చే
రినిను న్వేడిన నూరకుందువహహా శ్రీ 90

మ॥ క్షితిలో నేరికిఁ జెప్పరానియఘముల్ చింతింపకేఁ జేసితిన్
గతియుం కేమని వేడఁగా విబుధవర్గంబెంతయున్ సప్రమా
ణతతో నా శ్రుతులొప్పఁ జెప్పిరి భవన్నామస్మృతిన్ బోనిదు
ష్కృతమింకెందును లేదటంచుమిగులన్ శ్రీ 91

మ॥ శరణన్నన్ గరుణింపవయితిదిసర్వాసర్వేశ నన్నింకసా
దరతన్ బ్రోవకయున్న నీదుపతితోద్ధారక్రియారూఢస
ద్బిరుదాంకస్థితితో సుతారకమహాభిఖ్యార్థమున్ దోనునీ
స్థిరకారుణ్యముతో సుభక్తవరదా శ్రీ 92

మ॥ ఇతరోపాయములెల్లఁ గాంచిసుఖమెందే లేకవర్జించి మా
నితపారంబిదిగా గ్రహించినిరతిన్నీ పాదపద్మంబులే
గతిగా నెంచిభజించిమించివినతుల్గావించినీచెంతఁ జే
రితినీచిత్తమునాదుభాగ్యమటుపై శ్రీ 93

మ॥ పతితానీకముఁ బ్రోతునంచుబిరుదొప్పంబూనియున్నావుసు
స్థితిమీఱ న్నమ్మనునీవునన్నొకసివాసిన్ బ్రోవకున్నన్ర్వదు
న్నతికిన్ లోపమువచ్చుఁ గాననదియూనంబొందకుండంగనం
చితలీలన్ననునేలుకొమ్మకరుణన్ శ్రీ 94

శ్రీహయగ్రీవాయ నమః

# కొప్పలింగేశ్వరదండకము.

---

శ్రీమన్మహాఖండగోదావరీ ప్రాక్తట ప్రోల్లసద్రాజమా
హేంద్రప్రఖ్యాత పూర్ధర్మదిఙ్మండల ద్వాదశ క్రోశదూరస్థిత
తత్కాలసత్కోటిశిఖీదివ్యతీరోజ్జ్వలత్పల్వలక్షేత్రవాసా! జగద్వ్యా
స నీదివ్య చారిత్రముల్ గూర్చి పూదండగా దండకంబొక్కం
డర్పింతునీకేను గైకొమ్ము మేలిమ్ము శ్రీలిమ్ము వే కొప్పలింగా
హ్వయశ్రీమహాదేవదివ్యప్రభావా! విశుద్ధస్వభావా! కృపాపూ
ర్ణభావా! సజాతీయభేదాద్యభావా నిజాధీనజీవా! భవారణ్య
దావా! భవద్దివ్యచారిత్రముల్ పూని వర్ణింప నేనెంతవాఁడన్
సహస్రాస్యముల్ కల్గు శేషాహికింతైన శక్యంబు గాదన్నచో
నజ్ఞులైనట్టి మాబోంటిమూఢాత్ములం జెప్పఁగానేల? దిక్చేల!
దృక్ఫాల! ముంగుంభసంభూత మౌనిప్రకాండుండు కైలాస
శైలాంచితాధిత్యకాభూమి శీతాద్రిరాట్కన్యకాభవ్య క
ల్యాణ దివ్యోత్సవారంభ వేళం ద్వదీయాజ్ఞచే లోకబాధాప
నోదార్థమై దక్షిణాశాతటీభూమికి న్వచ్చుచో నిచ్చటన్మచ్చ
టంజేరి మీరచ్చటన్ దత్సకాలంబు(నం)దుత్సవంబొప్పనెల్లం

డిరో యంచు నాత్మభక్తవ్యక్తిన్ జెందిన్ఖిజ్ఞామూర్తి దర్శింపనేకా
గ్రచిత్తంబునన్ బూనిధ్యానింపఁగా మీరుసదృక్షిసతో ద్యద్వి
లాసంబుతో నిందుభ్రత్వరుష్టై ప్రత్యక్షసంజూచి వేధంగులన్ని
మ్ముఁగై వారముల్ చేసితన్మంగళాకారరేఖా విశేషంబుతోనిం
దు నిల్వంగఁగాంక్షించినన్ దత్స్వరూపంబుతో నెమ్మిఁబ్రత్య
క్షమై మీరుగస్త్ర్యాశ నామంబుతోనిల్చి యోగీంద్ర సంసేవితై
కాంతభావంబుతో నుండఁగాఁ బెద్దకాలంబతిక్రాంతమై యే
గినా వెన్కనుద్యత్కలివ్యాప్తివర్తించె నిట్లుండఁగా నొక్క కా
లంబునన్నీదు పూజాకరుండైన పూజారియొక్కండు వారాం
గనా నిత్యసాంగత్యశీలుండు నీపూజనార్థంబుగాఁ గూర్చియు
న్నట్టి చొక్కంపు మేల్తావి పూదండలావేశ్యకై శయ్యనందుం
చి యాకల్కితోఁ గుల్కుపూముల్కు విల్కాని మేల్కేలిగావిం
చి తద్గణ్యలావణ్య పణ్యాంగనా భుక్త శేషంబులై నాంతమూ
ల్యంబులై నట్టి మాల్యంబులం దెచ్చి నీపీఠభాగంబునందుంచి
నీదివ్యసందర్శనార్థంబుగా వచ్చి యున్నట్టి భూమండలస్వామికి
ర్పింపఁగా నాతఁడాపూలదండాత్మహస్తాబ్జ మందుంచి వీక్షింపఁ
గా నందునీలంపురా సొంపుడాలింపుగాదింపు మీ లాశిరోజం
బొక్కండుండి నంజూచి యాతండుదగ్రాగ్రహవ్యగ్రుఁడై స్వా
మి నిర్మాల్యమా మాల్యమందిప్పుడీ గంధతైలార్ద్రచించద్విరోజం
బ్బుర్గాఁగారణం బేమి? యోయార్చ రీష్టదుష్టార్చకా? యనన్నాతఁడాత్మం

డై వాఁడు సర్వాంగముల్ కంపమొందంగ నోచండ కోదండ దోర్దండభూమండలాఖండలా సావధానంబుగాఁ జిత్తగింపంద గున్ భూమిదేవా మదీయాపరాధంబులేదీ శిరోజోత్తమంబెంత మాత్రంబునున్వేఁడుగా దీనభాంశూజ్జ్వల స్మౌళిదేగాని యం చుఁ దిటంబొప్పఁగాఁ బల్కినన్, విస్మయంబంది యామాన వాధీశ్వరుండిట్టి దృష్టాంతమున్నాకుఁ జూపింతువా చూపలేకున్న నీకుఁ శిరశ్ఛేదరూపంబుగా శిక్ష సేయింతు, మన్నన్, ‟నదే చూడుఁడీ క్ష్మాతలాధీశ” యంచుం బ్రకాశంబుగాఁ బల్కి తానం తరంగంబులో ‟నీశమాంరక్షతి వాక్యార్థనైకాగ్రనిష్ఠా పరాయత్తుఁడై యుండఁగా నప్పుడీ వొప్పుగా మెప్పుగాఁ దప్పులే కుండఁగా ముప్పురాకుండఁగా రప్పలేకుండఁగా గొప్పపోకుం డఁగాఁ దాల్చె మీభక్తసంతాన దీక్షామహోదార విస్ఫూర్తి లోకంబునం దేట తెల్లంబుగాఁ జూపియున్నట్టి ప్రత్యక్ష దై వంబ వో స్వామి నీదివ్యలీలా చరిత్రంబు లెన్నెన్ని యోసన్నుతిం పంగ నెవ్వారి శక్యంబు సర్వామరగ్రామణీ! దీనచిన్తామణీ! యార్తరక్షామణీ! హృత్తమోద్యుమణీ! సోమనీదాసుడం బ్రోవు నన్నేలి రక్షింపుమీశా! నమస్తే నమస్తేనమః॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ॥ ఓంతత్సత్॥

ఇది శ్రీకూచిమంచి సోమసుందరకవికృతులందు

శ్రీకొప్పలింగేశ్వరదండకము.